# గాంధీనిర్యాణము





రచయిత

జి. వి. రామారావు.

మొదటికూర్పు 1000 ప్రతులు

**1948**

 వెల **0-10-0**

# తొలి పలుకు



ప్రపంచమున మేఘుఁడు స్వార్జితమును సద్వినియోగ మొనర్చినట్లు అహింస, సత్యము, ఐక్యభావము, మహాత్ముని శాంతికర్మ హోమమునుండి, బయలుదేరిన త్రివర్ణ ధర్మచక్రము నేడు ప్రజాక్షేమార్థము, సస్యాభివృద్ధికొఱకు శత్రుబాధానివారణార్థము, భారతమాతకు ఛత్రము బట్టుచున్నది పూర్వది నతీయమామిడి గున్నలోని సువాసనలందిన రాజ్యలక్ష్మి, సగముకన్నులు మూసుకొనిచూచుచున్నది. స్వేచ్ఛాసూర్యునిలోఁ గలసిన గాంధిమహాత్ముని నిర్యాణము రచియించి, విజ్ఞులకందించుచుంటిని, "చంద్రునికినూలు పోగన్నట్లు" కర్మచంద్రునికి పూఁడా నూలుపోగగు నారచన, పాఠకుల హృదయములలో తరుమకు, ఆదరమునకు, స్థానమీయగలదని ఆశించుచుంటిని, కాలాగమజ్ఞులను సానబట్టు విమర్శకులు మన్నింతురుగాత మఱి లాలుమహాత్ముని నిర్యాణ కథాప్రేరేపకుడైన, దేవులపల్లి రంరావుగారు, ఈకథను హరిదాసులచే చెప్పించి, సోదరుల హృదయముల చూరగొన్నారు, కళతరిగిన ఈరాయలసీమ పంటను, వీరెన్ని మోఘరాంబువులు రాల్పవలసివచ్చినది, మహాత్ముని గాథ యను మధుర రసమును, ప్రజానీకమునకు పంచిపెట్టుచున్నందలకు పీగుధన్యులు.

బు: పా షు శు

ధి: ఇట్లు,

వై విధేయుఁడు

శా

ఖ: జి. వి. రామారావు.



శా॥ శ్రీరంజిల్ల శతావధాన కవితా శ్రీమంతి నీఫుల్ల హా
స్న్ని రేజాంతర తుందిలామృత రసానీకంబులందించిన
స్మేరాంకూరములన్, స్వరాజ్యరమపై చిత్రించి,
చెన్నొందగని
ధీరత్వంబును, యంకితంబిడితి, గాంధీ సత్కృపన్ బ్రోవుమా

## ప్రార్థన కల్యాణి త్రిపుట (ఓంకార)

శ్రీగాంధీ అహింసారూప, దివ్యజ్యోతి పరిభాపరివర్త ॥శ్రీ॥
నీగానము సేయువారానందమందగ జేసి బ్రోవుము ॥శ్రీ॥

త్యాగము, ధర్మము, ధైర్యము, నీసొమ్మెకద
రాగసుధా లహరీయన భరతాంబ,
భాగ్యపురాశివిమై, కీర్తిగాంచు నినుందలతు॥శ్రీ॥

# కథాప్రారంభము.

కల్యాణి-ఖండగతితాళము

బాపుజీచరితము ప్రజానందభాగ్యము ॥బా॥
పాపజాలములన్ బారదోలఁగల మన ॥బా॥
సంపత్ప్రదంబు సత్యమహింసాబోధారూపము
నగుమొగమును విపదాంబుధినావయు ॥బా॥

మంజరి

పూరుబందరను గ్రామముపేరున పుణ్యసీమగలదొకటీ
తరుగనిసిరులన్ కాబాపుట్లి ప్రియదంపతులనపేర్బడసెఁ
కాలముబుచ్చుచు దేశనాయకుని గనికర్మచంద్రుఁడను మన్
లాలనపాలన లీలలదేలుచు పాలకులగుచును యున్నన్

వ. మోహనదాసు కర్మచంద్రుఁడను నామధేయం బున 1869-2 అక్టోబరు శుభదినంబున జన్మించి, 1883 లో పాణిగ్రహణంబునొందె. లండన్‌లో విద్య నభ్యసించి, న్యాయ పట్టా నార్జించి, ఇండియాలోని రాజకీయరంగమున ప్రవేశించి, ప్రజాస్వేచ్ఛలకు భంగకరములైన శాసనములను ధిక్కరించి, స్వరాజ్యమును సాధింపనెంచి, దౌర్జన్యరహితమైన శాసనతిరస్కార సాధనమగు ఉప్పుసత్యాగ్రహమును, విదేశవస్త్ర బహిష్కరణము, శిస్తునిరాకరణము, ఖద్దరుప్రచారము బోధించునంత ఈ ప్రబోధమువలన జాతీయభావము

వృద్ధిగాంచి, ప్రజానీకముప్పొంగి ప్రతియింట రాట్నప్రచార
మెటువలె చేయుచుండిరనిన

కల్యాణి, ఖండ (పాడవేరాట్నమా)

రాట్నమా స్వారాజ్యరథ సారథివినీవు ॥రాట్న॥
పట్నాలు, పల్లెలున్ పరికించి నివసించి
నింపవే ప్రతియింట నీ గానమధురంబు
సంపూర్ణసమభావ శౌర్యసాహసముల ॥రా॥

వ. స్వరాజ్యసాధనసంపత్తియాయన్నట్లు మహిళలు,
సన్నని నూలుపోగులదీయుచు, పోటీలభివృద్ధిజేయుచు మహా
త్మునికి నూలుపోగులు కానుకలర్పించుచుండిరి,

ఖండ

పేదలను సేవించు సాధనేనీవిలువ
సత్యమేనీరూపు శాంతమేనీకథరు
నిత్యజీవనములో నీనూలుదారమున
నీత్యాగమునుచాటు భక్త్యానురాగమా ॥రా॥

వ. వేరొకవంక విదేశవస్త్ర బహిష్కరణోద్యమ
మెటుల సాగుచున్నదనిన, నాయకులు, మహిళలు కొట్లలోని
విదేశవస్తువులదెచ్చి యగ్నికాహుతియొసర్చుచుండిరి. ఏమూల
జూచినను వస్త్రదహనమే జరుగుచున్నది. మండువేసవి యెం
డలకైనను లెక్కజేయుటలేను త్యాగధనుల కోలాహలము.

భీంప్లాసురాగము-ఆదితాళము.

భారతదేశము బంధవిమోచన బడయగవలయునురా ॥భా॥
సత్యాగ్రహమున సాధించుమురా శాంతమే సౌఖ్యమురా॥భా॥

వ. మఱియొకవంక శిస్తునిరాకరణోద్యమంబునకు తం
డోపతండంబులుగా జనసమూహంబులు బయలుదేరి

భీంప్లాసు-ఆది

ఖద్దరుధారణె కవచముమనకూ
ఖడ్గము ఆత్మబలమురా వీరా
కప్పముగట్టని కదలికమతమూ ॥భా॥

వ. శిస్తుచెల్లించనికారణమున ప్రభుత్వమునకు లోటు
వచ్చినది. వేలకొలది ప్రజల నిర్బంధించి జేళ్ళలోబెట్టుచుం
డిరి, హింసించుచుండిరి. రాజ్యమల్లకల్లోలమగుచున్నది. ప్రభు
త్వము తల్లడిల్లుచున్నది. ఉప్పుసత్యాగ్రహ మెటులసాగుచున్న
దనిన.

భీంప్లాసు ఆది

ఉప్పుజేయగను యూహింపగవలె ఉన్నది పున్నెము
దేశముకై వెనుదీయకు లేరా ॥భా॥

వ. ప్రభుత్వం కండ్లెర్రజేసి, శాసనధిక్కారులను, విదే
శవస్త్ర దహనసంస్కారులను లాఠీలతో చావమోదుచుండిరి
ప్రజానీకము భయమందక ప్రభుత్వమును లెక్కచేయక
ముందుకు సాగుచుండిరి.

ఖండ

నవభారతారాధనాదేవతవునీవు
నవరించుజగమెల్ల శాంతింప

మురిసిపోయెడి దేశముస్తాబుకొరకునై
తెరవుచూపించాలి, చిరకీర్తినిలపాలి ॥రా॥

వ. వేనకువేలు మహిళలు, నాయకులు త్యాగులై గుర్రాలత్రొక్కుళ్లకు లాఠీలకు బెగడొందక

ఖండ

అస్పృశ్యతాభావ మంతరింపగజేయు
మాగాంధినవ్వుతో మాదేశసౌభాగ్య
క్షేమంబుపులకింప చేయవేనాదంబు
తేజంబువెలుగగా దిశలెల్లమార్మ్రోగ ॥రాట్న॥

వ. పట్టుదలవహించిన భారతీయుల త్యాగమునుగాంచి ఆంగ్లేయులు భారతీయులకు స్వరాజ్యమిచ్చినందున రథసారథియైన మహాత్మాగాంధీగారు ధర్మసంస్థాపనార్థంబవతరించిన ధర్మమూర్తియాయన. దశదిశల వెలుఁగొందిసత్యం యహింసలనే సూత్రంబులుపదేశించి, మానవకోటి ప్రేమైకనిధానంబనంబరగి 1947-15 ఆగస్టుతేదీన ఢిల్లీకోటపై త్రివర్ణపతాకంబు స్థాపించె నట్లనిన.





సీ॥ సాంధ్యరాగములోని స్వాతంత్ర్యరేఖల
మెఱుఁగుతరఁగులను గుర్తెఱిగియుంచి
ధావళ్యరాసిలోఁ దనరారుమేలిమి
చాకచక్యము నెల్ల సేకరించి
తొలకరిచినుకులం బులకించుభూదేవి
పాలాశరూపంబు పదిలపఱచి
ధర్మచక్రము తలఁదాల్చియుఁ దనలోని
ఘనతపఃశక్తిని నినుమడించి
గీ॥ జాతిగౌరవశిఖరాలు ఖ్యాతినొంద
విశ్వజీవైఖ్యమును జేయు వేణునాద

సకలసంపద విజయపతాకమనగ
కర్మచంద్రుఁడు సమగూర్చి కఱగిపోసె
(వందేమాతరమను గీతమును ప్రార్థన జేయుడు)

భీంప్లాసురాగము—ఖండగతితాళము (మా తెనుగుతల్లి)

మా ఢిల్లికోటపై మాజాతిజెండ
మా గాంధిదేవుని మహిమలనె దెలుపు ॥మా॥
ఆరుఖండాలలో భారతీయులఖ్యాతి
ప్రణవనాదంబునే పలికించుమాజెండ ॥మా॥
తరులెక్కి గిరులెక్కి చిరుగాలిలోజెండ
మురిపెమున ధర్మంబు ముందంజవేయంగ
సత్యం యహింసలే చాటుతాయి
శాంతిత్యాగంబులే, చలగుతాయి ॥మా॥
నౌరోజి గోఖలే నాటించుబీజంబు
తిలక్ జేయూతచే పులకించు భావంబు
వృక్షమై శాఖలై వృద్ధిగాంచియు దిశల
అనురాగభావాలు అల్లుకొన్నంతనే
కస్తూరివాసనల్ గ్రుమ్ముకొని వీవంగ
పండితుని ధీయుక్తి వల్లభాయుని శక్తి
భరతాంబ వడిలోన బరుగులిడునందాక
నీజెండతో నాడుకో
నీజెండనే - చూచుకో
హేఢిల్లికోటా, హేఢిల్లికోటా ॥మాఢి॥

(ఝండా ఊంచారహే) అను గేయము పఠింపగలరు)

వ స్వరాజ్యమంటె ఇండియానుండి ఆహార పదార్థములు వెలుపలికిబోరాదు. ప్రతివస్తువ ఇండియాలో సిద్ధముకావాలి గ్రామ పునరుద్ధరణ, పరిశ్రమలు, నీటిమార్గములు, రాకపోకల సౌకర్యాలు, గృహపరిశ్రమలు, వ్యవసాయాభివృద్ధి, గ్రంథాలయములు, పాఠశాలలు, సహకార సంఘాలు జాతీయ సాంప్రదాయము, పంచాయితి సంఘాలు, ఆసుపత్రులు, ఆరోగ్యమందిరాలు, పశువృద్ధి, నౌకలు, వృత్తి విద్యలు, పోటీ విధానాలు, స్త్రీవిద్యాభివృద్ధి, అంతర్జాతీయ వాణిజ్యములవలని ప్రయోజనములు, అంటరానితనము రూపుమాపుట, కాంగ్రెసు ఒక ఉన్నతవృక్షము, అందరం సమానంగా తినాలిఅంటె, పనిచేస్తుయుండాలి. అన్నివర్గాలు ప్రాతినిధ్యం పొందాలి, నూతనరాజ్యాంగములో, ప్రజలు బాధ్యత వహించవలయునుకృషినాయకులది ఫలవంతముగాఁజేసుకొను బాధ్యత ప్రజలదని, పండితుని తలపై ప్రధాన భారంబుమోపి చీలిపోయినయిండియా ఐక్యసూత్రంబున నెల్లు బంధీకృతమగునాయని డోలాండోలితుడగుచున్నతరి, బీహారు, బెంగాలు, పంజాబు సింధురాష్ట్రములలో, హిందూ ముస్లిం మతవైషమ్యములు చలరేగిన గోవుల నదలించు గోపాలుడాయన్నట్లు కేలకట్టెనాని, నవఖాళీ పరిసరప్రాంతములలో పర్యటనఁజేయుచు ఏమని బోధించుచున్నడనిన,

కాఫి రాగం, త్రితాల్ (ప్రేమకిబన్సి)

ఐఖ్యత, సాధనయే, శాంతముగా ||ఐ|
మతకలహము వినాశనంబూ
జ్యోతి, ఖ్యాతి, చెరుపునుగా ||ఐ|
చీకటిలోనే, కావలె వెలుగూ
జేసెడిబాధ్యత మనదే ||ఐ|

వ॥ మతకలహంబులం జల్లార్చి రాజధానియగు ఢిల్లి నగరంబుఁజేరి, బిర్లాభవనఁబున నివాసంబు యేర్పరచుకొనియె 1948/29 జనవరి తేదీన ఉదయంనుండి సాయంత్రంవరకు, కాంగ్రెసు నియమావళి, చిత్తు ప్రణాళిక సిద్ధపఱచి, 30 తేది ఉదయం ప్రాతస్మరణఁజేసుకొని, 8 గంటలకు ప్యారీలాలుకు ప్రణాళికనిచ్చి సవరింపుమనిఁజెప్పి, 9-30 గంటలకు 14 ఔన్సుల మేకపాలు 14 ఔన్సుల పులుసు, నారింజరసము. పచ్చి కేరాటు రసము భుజించి, నాలుగు గంటలవఱకు సర్దారు వల్లభాయి పటేలుతో సంభాషించుచుండె నెటులనిన

సీ। స్వారాజ్యమును నేడు సాధించితిమిఁగాని
ఐఖ్యసూత్రంబుల యల్లలేము,
పౌరుల ప్రేమఁ జేఁ బట్టియుండియును సం
స్థానాల కలయిక సలుపలేము
సత్యం యహింసల స్థాపించితిమిఁ గాని
మత పిచాశపు మాపు మాపలేము
యపహృత స్త్రీలకై యార్భాటమేగాని
రంగారు ముంగిళ్లొసంగలేము

గీ. కాంగ్రెసనుసంస్థ భారతజాతి కెల్ల
సంతసముఁ గూర్చె, సత్యమే స్వార్థపరత
ద్రోలగఁ బ్రజలకు సౌఖ్యంబుఁ గలుగఁ జేయు
సంస్థయనుచు, ప్రపంచాన చాటవలయు.

పంచచామరము

ప్రాథమిక దళాలుగాఁగ బయలుదేరిమీరలున్
బాధపడెడు బీదప్రజల బాగుసేయగావలెన్
బోధఁజేయునాయకుండు ఖాదియన్ ధరించియున్
బేధమనక కులమతంబు పెంపుసేయగా వలెన్.

గీ॥ మంచిదనరాని దానిని విసర్జించవలయు
గ్రామప్రజలకు ఐక్యంబుఁ గలుగఁజేసి
యక్షరాస్యత నొనగూర్చు లక్ష్యమందు
శుభంబగు, కాంగ్రెసు వాసిగాంచు.

వ॥ యని హితబోధనలొనర్చి, పటేలుకు శలవొసంగి 5-5 గంటలకు బిర్లాభవనమునుండి ప్రార్థనాలయమునకు మహాత్ముడుఁ బయలుదేరి యిరువైపుల గుమిగూడిన ప్రజల మధ్యనుండి పోవుచున్నప్పుడు.

మంజరి

జనసమూహముల దాటుచు, చకచక గోడ్సేయను జట్టీ
కనుచూపుననే పిస్తోల్ ధామ్మన. గాంధికడుపుపై గొట్టెన్.

సీ॥ ఒక గుండునాభిని, బెకిలించినంతనే
రామ రామాయనురవముఁ జెలఁగె
వేరొండు గుండు, చేజారినయంతనే
రక్తప్రవాహంబు రాదొడంగె
గుండెలో నొక గుండు గృచ్చుకున్నంతనే
స్పృహదప్పి, నేలపైఁగృంగి పడెమొ,
అంగ వస్త్రము దుమ్మునంటెఁ బచ్చికపర
కలు, శాంతమూర్తిపై గ్రమ్ముకొనగ

గీ॥ రక్తరంజిత వసన విరక్తియనగ?
కాళ్ళ చెప్పులు నొకవంక కళ్ళజోడు,
జారిపోయెను మనబాపు జగతిలేఁడు
రాడు, పిలచిన, బీదల తోడు నేడు.

నాదనామ క్రియ - ఆదితాళము.

అస్థమించినావా బాపూ ॥అ॥
బీదల పిలుపులు పిలుచుచున్న వే
రోదమూన్పగ రావా ॥అ॥
ఎవరినిచూపి, యేగినాడ వికు
నవ్వున్ను, రానేరావా ॥అ॥

వ॥ ప్రార్థనకై వచ్చిన ప్రేక్షకుల వైపు రాముని వైపు రెండు చేతులనెత్తి జోడించడమే బాపూజీఁ జేసినలోకము లోప తుదిచర్య.



సీ॥ శాంతరూపంబుతో సాధింతు వెన్నాళ్లు
                    చాలింతు ననుచును కేలుమోడ్చె
విశ్వమానవప్రేమ వెర్రి యింకెన్నాళ్లు
                    చాలింతు ననుచును కేలుమోడ్చె
ఈ దిగంబర వేషమేయుట యెన్నాళ్లు
                    చాలింతు ననుచును కేలుమోడ్చె

గీ॥ రామ, హారామ, జయపరంధామ యనుచు
భరతపుత్త్రుడు స్మృతిలేక పడినయపుడు
కడుపు తరుగుకపోదె, లోకమున నెంత
ధైర్యశాలికినైన, నిర్దయునకైన.

మంజరి

అమృత కలశమును భారతదేశము, ఆస్వాదింపగ లేకన్
క్రమమెఱుగనిగతి, కలశంబున్, భగ్నంబొనరించుక క్రిందన్
కరుకుతుపాకుల రాజ్యమైన, నవఖాలీయాత్రలో నైనన్
మఱచిపోయిన నొకయుగయాత్రావాలెనె, దిరుగుమహాత్ముని పైనన్
కన్నుల నెత్తైన మాల్వీలీల పంజాబుదురంతాలైనన్
మిన్నులగూల్చెడి యాటంబాంబులు మున్నేతలలున్ వ్రాల్చెన్
నేటికియొక ప్రద్రోహికి బలియైనేడ్చు చుబోయెన్ సంద్రాల్
దాటినశక్తియె పిల్లకాలువలో దడబడి గూలెంగాదే

వ. మట్టిముద్దలనుంచి మహావీరులను సృష్టించిన ఆయన పెదవులు గట్టిగా బిగుసుకపోయినవి. కండ్లు శాశ్వతముగా మూసుకపోయినవి ఆ ప్రశాంతవదనసీమ యిఘుపన్ను లేప పద్దన్నట్లున్నది. యహింసయనే పారిజాతప్రసూనము సువాసనల వెదజల్లుచున్నప్పుడే గోడ్సేనఖములు గిల్లివై చెగదా యని యశ్రుధారలచే ప్రేక్షకులం గన్నులు కానవచ్చుటలేదు.

మంజరి

పాలకవర్గము దిగులుంజెందగను నూలుదారముల దాల్చి
సలలితప్రేమన్ సారధియగుచున్ స్వరాజ్యసాధన గెల్చెన్

వ. యని నాయకులు ప్రజలు వాపోవుచున్నంతవార్త ఢిల్లీనగరములో

మంజరి

గందరగోళము చిందరవందరగా ఢిల్లీ కెగబ్రాకెన్
సంచలనములను హత్యావార్తయును చాటుచు జవ్వాడు జేరెన్
ముందుకుసాగుచు వల్లభాయియును గుందగయా
మహాంతుబాలెన్
కందళజేసియును వెంటనె ప్రజయాక్రందనలోనం గలిసెన్

వ. ఈవార్త విన్నంతనే నెహ్రూపండితుండు



సీ॥ పిడుగుబోలినవార్త బడినంతనే మిన్ను
తలపైనబడినట్లు తల్లడిల్లె

కనుదోయిజలముచే గప్పియుండుటచేత
యంధునిరీతిగా గుందుచుండె
పెన్నిధిఁగోల్పోవు పేదచందంబున
తడబడుపదములు వడకుచుండె
అతి జరాభారాన మతిఁగోలుపోయిన
వానిఁబోలియు యేమియనకయుండె

గీ॥ రాజకీయంబుఁ దలపడు ప్రాయ లేఁడు
బంధు మిత్రుల బలికింప పాటుఁబడఁడు
వచ్చువారలమెవరని పృచ్ఛలిడడు
సచివుఁడౌ గాంధి విడనాడి చనిన వెనుక.

వ॥ కృష్ణుని విడనాడిన ఫల్గుణుఁడాయన్నట్లు పలు గెత్తుకొని బిర్లాభవనమునకు వచ్చినంతనే అప్పుడే మద్రాసునుండివచ్చిన లార్డ్ మౌంటు బాటెన్, వల్లభాయిపటేలును, మౌలానా ఆజాదును, నాయకప్రముఖులు, పుత్రులును, పరమాప్తులును, బాపూజీ మంచముప్రక్కన నిలుచుండి యుండ, ఆయన తుదివిశ్వాసాన్ని విడుస్తుయుండగ, యొకవంక భగవద్గీతాశ్రవణమును, మఱియొకవంక యత్యంతప్రియమైన "వైష్ణవ జనతో తేనేకహియే" యను గేయంబులు గానంబులు సేయుచున్నతఱి ఈ వార్త బలదేవసింగ్ గాడ్గిల్ కు తెలసిన సీకును నిశ్చబ్దమైన బిర్లాభవనము చేరేవఱకు తుదిసారి దర్శనమైన లభింపదాయని ప్రేక్షకజనము

సీ॥ రఘువంశశూరుడౌ రాముబాణంబైన
నీలోనిసత్వంబు నిలుపలేదు
చిన్నికృష్ణుని చేతనున్న శంఖంబైన
నీలోనిశాంతిని నిలుపలేదు
బుద్ధదేవుని పరిపూర్ణజ్ఞానంబైన
నీలోనితత్వంబు నిలుపలేదు
ఏసుబైబిలుఁజేసి వాసిగాంచెనెగాని
నీలోనిచిరునవ్వు నిలుపలేదు

గీ॥ ప్రకృతితత్వంబు గ్రసియించి భరతమాత
కంతులేనంత వెలుగును సంతరించు
వేదశిఖరాలపైనున్న వెన్నెలయను
దివ్యరూపంబునిది గాంధీమహాత్మ

హిం॥ తోడి-ఆది

చూడవుగా కనులను దెరచీ తోడులేదా ॥చూ॥
నీప్రజల న్నివరోదార్చేదరూ
దీనదయా, తేజమును గాంధీ
విడనాడితివా వేడ్కలేదు యిఘనూరూ
తోడులేదా ॥చూ॥

వ. యశ్రుబిందువులు గండస్థలంబులపై గంతులు
నైచుచుండ యొకరినొకరు త్రొక్కుకొనుచు పసిబిడ్డలు నలి
గిపోవుచున్నను పరవాఁజేయని మహిళలు తమ హాలముల

పొలములలో నాపి, ముల్లుకఱ్ఱలతో బుఱదచినుకుల ధోవతు లతో కృషికులు సగముఁ వ్రాసిన ఫైళ్ళను బల్లలపై పారవైచి కారణమేమని పరుగెత్తుకొనివచ్చుచున్న యుద్యోగులు, భోజనముజేయుచున్నవారు కంచములం దిగజారి ప్రక్షాళనంబుల మఱచి, కాఫీహోటళ్లలోఁ వారు సగముఁ త్రాగిన టీకప్పులతో నోటిలోని యిడ్లీ, రవ్వట్లు, బొబ్బట్లతో వచ్చుచున్న ప్రజాసమూహామును శాంతిపరచుటకై జవహరుపండితుఁడు బిర్లా భవన సింహద్వారమెక్కి పాలిపోయిన మోముతో గడగడ వణుకుచున్న మేనితో గద్గదస్వరముతో మన సారథి, మన సచివుఁడు, మన నెయ్యము నిర్యాణముఁ జెందినాఁడు. ఒక యున్మత్తుడాయనను రివాల్వరుచే కాల్చెను. శోక సాగర నిమగ్నులమైన మనము ధైర్యమునుఁ గోల్పోరాదని చెప్పిన ఈ వార్త రేడియోద్వారా వ్యాపించుచున్నదని.

సీ॥ ఢిల్లినగరము నెల్ల తల్లడిల్లగఁజేసి
ఆకాశవీధిలో నావరించి
అమెరిక, యింగ్లాండు, ఆస్ట్రేలియన్ జూచి
ఆఫ్రికాఖండంబు నందు తేలి
జర్మని, నార్వేలఁజేరి, గుసగుసలాడి
హాలెండు, పోలెండుఁ గలియదిరిగి
రష్యా, చైనాలోన, రాయిడిఁగలిగించి
బర్మా, సిలోనులోఁ బ్రాకిప్రాకి

గీ॥ కడకు బెంగాలు దిగులొంద నడకలిడుచు
చన్న రాష్ట్రాన నివసించియున్న ప్రజల
చెవిలో దుర్వార్త సోకించి జికిలి సోయి
వచ్చుచున్నాడు మనవార్త వాహకుండు

వ॥ ఢిల్లీనగరము హర్తాలుఁజేసినది, గవర్నర్ జనరల్ భవనము పార్లమెంటు భవనము, సెక్రిటేరియట్ రాయభార కార్యాలయం, మఱియు, ప్రయివేటు భవనాలపైనున్న జాతీయపతాకములు సగమువఱకు దించఁబడినవి, అయినగాత్రములలోని పతాకములు వంగిమహాత్ముని మరణము దెల్పినవి, ఆరాత్రి బిర్లాభవనములో మహాత్ముని భౌతికదేహమెల్లున్నదని:

సీ॥ తెల్లఖద్దరుబట్ట తెచ్చి పాదంబులు
కడుపువఱకును దూర్చి కప్పియుండె
గుండ్లు తగిలినచోట గుర్తుగా మచ్చలు
మూసినకనుదోయి జోసినోరు
మెడనిండ వైచిన మెరుగు ఖాదీదండ
యగరువత్తులలోని పొగలురగుల
తీరుగా గది గులాబీరేకులన్నింపి
భౌతికదేహంబు భద్రపఱప

గీ॥ మనపటేలును నోటిలో మాటలేక
నేలగీతలగీయుచుఁ జాలినొంద

అమృతకౌర్ పాదములచెంత నధివసింప
బాపుజీ నాటిరేయిని బాపుకొనియె

(రఘుపతిరాఘవ రాజారాం అనుకీర్తన)

వ. బెల్గాం, అహమదాబాదు. తిరుచునాపల్లి, కాశి, పంజాబు, మైసూరులకును, బొంబాయి, పూనాలలోగల హిందూమహాసభలపై బడి యేకముహూర్తమున ప్రజలెల్లు ధ్వంసముఁజేయుచుండిరనిన

మంజరి

సావర్కర్ గృహమును విధ్వంసముసలుపుచు భూపట్టారీ
యావరణంబును తిలక్ మందిర కార్యాలయమున్ బడద్రోసీ
యేడీ నిగ్గని చావమోనయుచు యేగిరిదాస్లుకొట్టికై
దాడులుసలిపియు నురువదియుండ్లను దగ్ధపటలమొనరించీ

(చనుడెందమార, ఫలిం కృష్ణలీల)

ఉద్ధృతంబుమీర కండ్లెఱ్ఱబార ప్రజల్ బారుదీర్చి
బొంబాయిదూరి పేర్చార్చిఘోర హిందూమహాసభలను
కార్యాలయముల ధారుణీఁగూలగఁ జేసినారూ ఆస్థలన్
గృహంబులన్ నేలపాల్జేసీ చావమోమున్ దృంచి సంచరిం
చుచున్ యున్నవారినిన్ కనిన వినిన పూనా బొంబాయి
వణుకగన్ ॥ఉ॥

వ. మహాత్ముని నిర్యాణవార్త ప్రపంచమంత వ్యాపించినవెంటనే దేశనాయకుల జోహార్లు వచ్చుచున్న వెటులనిన

యునైటెడ్ కింగ్డం ప్రభుత్వముతరఫున మీకు మీ సహ చరులకు మా క్షోభను తెలియపఱచడానికి ఆతుర్దాగా యున్నది. యని జార్జిరాజు ప్రధాని యట్లీ తెల్పిరి. ప్రపంచ కవాన్యగగణ్యుడగు బెర్నాడ్‌షా యతిసాత్వికత్వము బహు ప్రమాదకరమనడానికిది నిదర్శనమనియు, అమెరికా విదేశాంగమంత్రి జార్జిమార్షల్ "గాంధీజీ మొత్తము మానవజాతికే ప్రతినిధియని" దక్షిణఆఫ్రికా కేప్‌టౌను నేడు ప్రపంచములో ఆయనకీర్తి సాటిలేనిదిగా గడించినాడని మాస్కోనుండి విజయలక్ష్మి బాపూజీ పవిత్రసాధనకై జీవితాన్ని యర్పిస్తానని నలుమూలలనుంచి వచ్చుచున్న జోహార్లకంతులేదు. చింతించుచున్న ప్రజలు యూరటజెందుటకాయన్నట్లు సూర్యోదయంబయ్యె. 31-1-1948 వ ఉదయం పూలమాలలతో యలంకరింపబడిన మోటారులో గాంధీ భౌతికదేహంబుంచి నెహూ్రి దేవదాసుగాంధీ ప్రభృతులుపూలమాలలు వైచుచుండ గవర్నరుజనరల్ లార్డు మౌంటుబాటెన్ తన చేతికి నల్లగుడ్డ కట్టుకొని నడుచుచుండ పాదాలవద్ద పటేలు వీరి వెనుక రామదాసుగాంధీ ఈయనసమీపంగా బలదేవసింగు కూర్చొనియుండ యిండ్లకప్పులపైన గోడలపైన చెట్లపైన నున్న ప్రజలకు లెక్కలేదు. మఱియు విదేశీయరాయబారులు నల్లదుస్తుల ధరించి శిక్కుసైనికులు శంఖారవములతో గాంధీజీకి జై యను నినాదంబులతో 11-45 గంటలకు శవము కదిలి ఊరేగించుచున్నతరి

శుద్ధసావేరి-ఆదితాళము (లోకముచీకటి)

పౌరుల పెన్నిధి బాపూ తిరుగని పయనమయ్యెనా నా ॥పౌ॥
తరతరమ్ములకు తఱుగనిదాస్యము కట్టు త్రెంచినావూ ॥పౌ॥
మూగజీవముల మూల్గుమాన్పుతివి త్యాగము నేటితోచనెనా
సత్యభామ శాంతము యెటులగునో ఖ్యాతిఁదొలంగెను
నాహః ॥పౌ॥

భారతీయుడే హత్యజేసెనా పాపమే పండెనుగా
భారతాంబకే బరువైపోయెను బంగరుజ్యోతినినార్పెన్ ॥పౌ॥

వ. మెమోరియల్ ఆస్పత్రివద్దకు వాహనము వచ్చేవరకు చెట్లకొమ్మలు ప్రజలచే వంగి మహాత్మునికి వందనములర్పించుచున్నవి. అయిదవజార్జి స్మారకస్థంభాలు పెరిగిపోయినవి. సాయంత్రము 4-15 గంటలకు పావన యమునానదీతీరము లోని రాజఘట్టానికి భౌతికదేహము జేరినది. (అనగా హత్య జేసిన యిరువైనాలుగు గంటలకు) పదిహేనుమణుగుల గంధపుచెక్కలతో పేర్చిన చితిపై భౌతికదేహముంచి రామధన శర్మ వేదగీతాలతో శాస్త్రోక్తంగా కర్మకాండ జరుపుతరి రామదాసుగాంధి నవ్వుమోమున నాల్గుమణుగుల నెయ్యి బోసి చితికి నిప్పంటించెను. 4-55 గంటలకు చితిపై యగ్ని జ్వాలలు ప్రజ్వరిల్లినవి. సూర్యుఁడు కృంగిపోవుచున్నాడు భౌతికకాయము యదృశ్యమగుచున్నది. సూర్యాంతర్ధానమే గాంధియంతర్ధానము సంక్షుభితమైపోతున్న ప్రజానీకము కేలు మోడ్చి

గీ॥ ఐక్యసూత్రంబుచేతనే యందుకొనిన
రక్తమును చిందసల్పి స్వారాజ్యమందు
ప్రజ్వలింపుము జాతికి ప్రమదమొసగు
దివ్యజ్యోతిని నేడు గాంధీమహాత్మ

వ. అని మొక్కులిడుచు, చితికి ప్రక్కన, విఱిగిపడుచున్న గంధపుచక్కలకొఱకు, గులాభిభక్తుల కొఱకు గాలివలన యెగిరివచ్చెడి, చితాభస్మంకొఱకు పరుగులిడుచు దారికినంతవఱకు భద్రపఱచి యిండ్లకు వెళ్లిపోయిరి. పన్నెండవ దినంబున అస్థికలు పుణ్యనదీతోయంబుల సంచయనంబుగావింపనెంచి 11-2-1948 ఉదయం గం 4 30 లకు గోపురాకారం గల ఒక చిన్నపల్లకీలో, పద్మాకారంగల పీటమీద, రామ, రామయను యక్కరంబులు చక్కబడిన అస్థికల రాగిపాత్ర నుంచి తొమ్మండుగురు మోసుకొనివచ్చిన ఆపల్లకీని, న్యూఢిల్లీ రైలువేస్టేషనకుంజేర్చి ఇష్టుయిండియా స్పెషలు ట్రెయినును, అయిదు పెట్టెలుగలది పచ్చరంగునే నలంకరించి అస్థికలపాత్ర రైలునందుంచి ప్లాటుఫారముపై యిండియా ప్రధాని జవహారులాలు నెహ్రూ ముఖ్యనాయకులు కన్నీరొలుకుచుండ గం. 6-30 లకు

## మత్యతాళము

రైలుబండికదిలెనూ, ప్రజలుదిగులుంజెంద, భగభుగని, భగ్భగ్మనుచు కేకతో, బాపుచితాభస్మమునూ, దాల్చియు హారతి, ధగధగకాంతితో, తరలెను, ముందుకుగ ॥రై॥

పొగజిమ్మి, నగరములదాటుచుపోయెన్, వేగంబున, చింతిం
చుచానిపగిదిని, యోగానందముం గుచున్, తీగలపైరాగములను
దీయుచును, గాంధికి, జై, జై, యనుచూ ॥రై॥

గీ॥ గాజియూబాదు ఖురజాను గాంచి ఆగి
యలఘురత్రాసు, టుండ్లాను యాదరించి
యేట్వహాపండ్, కాన్పూరు కెనుచుబోయి
ప్రజల నోదార్చి ముంగకుంబయలుందేరే

వ. ఛత్రపతి శివాజీని, లోకమాన్యునిం గన్న పవిత్ర
మహారాష్ట్రవంశమున జన్మించిన పచ్చికిరాతకుని వాతబడిన
భస్మమును, మోయవలసి వచ్చెకదాయని, మధ్యమధ్యనాం
గుచు, ధర్మరాజు రాజనీతిని, ఏసుదయాపరత్వమును, సాక్రె
టీసు విజ్ఞాననిధి మహమ్మదు కార్యదీక్ష, కన్ఫ్యూషస్ యొక్క
ఆత్మసంశోధన, సత్యహరిశ్చంద్రుని సత్యమునాలోనున్నది కదా
యని సగర్వముగా, భుగభుగయని, భగ్గుభగ్గుమనిం బయలుం
దేరి 12 ఫిబ్రవరి 9-0 గంటలకు అలహాబాదు స్టేషన్ జేరినది,
నెహ్రూపండితుండు, సరోజిని వల్లభపంత్ స్టేషన్‌కు వచ్చిని
లుచుండునంత, సైనికదళం అస్థికలకు వందనం సమర్పించినవి,
వల్లభాయిపటేలు, మాలానాఆజాదు, వెంబడించుచుండ.

శుద్ధముఖారి, ఆది, (వెలిగింపుమా)

కదిలిందిగా, అస్థులరథమూ ॥క॥
కీపుకారులు, సాయుధులున్, చిన్నబోయినబ్యాండుతో ॥క॥

పదిలక్షల యాత్రప్రజంగుల్, ఆర్తిని, గుండెను చీలువన్
నయనంబుల్, దరిశనభాగ్యము, మురిపెముజెంద,
కరములుమోడ్చుచు, బాపూ, యనగన్ ||క||

గోడ్సేకరమూ, ఎటులన్ గాల్చెనోకద, హేయమిదియే
బాయునెఅపకీర్తి, హరి, హరీ, నూయజీవితముగాదే,
మనసారగ, నేడ్చుచుండన్ ||క||

వ రథానికిముంగు పన్నెండుమందిచొప్పున ఆశ్వారూఢులైన సైనికదళం, నడుచుచుండ, నిశ్శబ్దమురాజ్యముం జేయుచుండ, రథముపురుషోత్తమదాసు పార్కువద్దికి వచ్చేవఱకు, పండితుండు రథంబు డిగ్గినడుచుచుండె, ఊరేగింపు కానింగు రోడ్డుదాటి, ఫోర్టురోడ్డులోనికి వచ్చేవరకు సమయానికివచ్చిన ప్యాసంజరులోని ప్రజలకు దర్శనమిచ్చినది, రథముకుంభమేళా యుత్సవము జరుగుచున్న బ్యాండువద్దకు వచ్చేవఱకు జనసమూహములో కిటకిటలాడి పోయినది, ఆలిండియావారి మోటారుకారునుంచి "రఘుపతి" యనేకీర్తనం గానముం జేసేవఱకు లక్షలధ్వని ఈగానములోలీనమైనది, బాపూజీరథము దాదాపు 11-0 గంటలకు గంగానదీతీరానికిం జేరినది, హంసవలెనలంకరింపబడిన నౌకలోనికి అస్థికలుం జేర్చినప్పుడు ముప్పది లక్షల ప్రజానీక మేమని ఏడ్చుచున్నదనిన.

భీంప్లాసు, త్రితాల్ (బీనా-మధుర)

బాపూ, చిఱునగవిక రావా ||బా||
శాంతపురాగా, లాపనసేయ, జీవనజ్యోతిని వెలిగింపగరా,
నేడుగంగలో, గలిపెడివారిపై
కోపము, తాపము, జెందినావా ||బా||

విఖ్యాతమాలోఁ జేర్పగరావా
నేటికి నీకుఁ, మాకుఁ, బాసెఁ,
నయనబింధువే, నీకానుగా, వలసెనె దేవా పూజ్యభావా||బా||

నిజముగనీలో విజయము గలదూ,
జీవితప్రసవము, స్నిగ్ధతబాసీ
సత్యోపాసన, సనాతనములో సంగలిసెనా ||బా||

వ. నెహ్రూ, పటేలు, అహమదుకిద్వాయి, వల్లభపంత్ కూర్చొనియుండ, నౌకసరస్వతీ ఘట్టానికి వెళ్ళితిరిగి పుణ్యతీర్థములో నిలిపి వేయఁబడినది, విమానములుపైనుండి, ఈనౌకపై ప్రతిఅయిదు నిమిషములకు, పుష్పవర్షములుఁ జల్లుచుండ రామదాసుగాంధీ వేదోక్తంగాని క్షేపకర్మప్రారంభించి, రెండు గంటలకు, అస్థినిక్షేపం జరిగింది, ఈసైముకే, కలకత్త, బొంబాయి, కాశి, వార్ధా, కటక్, కాలీకట్, మొదలగు యిండియాలోని అన్నిపుణ్యనదులలో అస్థినిక్షేపంజరిగింది.

గంగాయమునలు. గోదావరి కృష్ణయు, కావేరి పినాకినులున్
గాంధీ అస్థుల భస్మము కలిమికి, గాంచెను పావనయశముల్

వ. అహింస హింసకు బలియైనది, ఆశాజ్యోతి నిరాశతో కొండెక్కినదని, నాయకులు, ప్రజలు ఏకగ్రీవముగా.

హిం॥ తోడి॥ ఆది (త్యాగమయీతూగయీ)

త్యాగమయా, రావుగా ॥త్యా॥
సత్యభాషణా, సచివుడవై
నగలన్నియు, నిన్నదుముకొన్నవా
భారతప్రకృతియో, తేజముగలసె ॥స॥

సదాజగతిపై నీదు పిలుపే
వినగాయగును మహాత్మా
యుగయుగములలో, నీరూపంబే, నిలుచు,
జగతిలోనన్ ధర్మము జయమగుగా. ॥స



వ. అంత నెహ్రూపండితుండు, వేదికపైనెక్కి లక్షల ప్రజానీకమున కేమని, బోధిస్తున్నడంటె

ఓ భారతీయులారా, నేటికి భారతజనకుని తుది దివసము సమాప్తమైనది.

సీ॥ చలికొండలకునైన జడుపుఁ జెందనినాటి
సత్యమే మన పతాకంబు యనగ
రక్తపాతములేక యుక్తిచే సాధించు
యాత్మయే మనకు ఖడ్గంబుయనగ
అతులితైశ్వర్య సంచిత యహింసా వైభ
వంబుయే మనకవచంబుయనగ
శాంతమూర్తి మహాత్ము స్థైర్యంబుఁ జేబట్టి
సలరారు వీరసైన్యంబుల నెడు

గీ. వారసులమైన మనము యున్నారమింక
మూగబోయిన వాణికై ముసుగులిడక
దేశదేశాలు గాంధి సందేశమెల్ల
ఆలకింపగ చాటుదాయన్నలార.

వ. స్వార్థరహితుఁడై దేశములందు సత్యం, అహింసల బోధించు పుణ్యాత్ముఁడు యిఁక మన మధ్యకానరాఁడుకాని ఆయన సందేశము అనశ్వరము జగజ్జ్యోతి మనల నెడబాయదు

త్రితాల్ (కితిబాయీ)

మనజ్యోతీ, త్రిగుణములఖ్యాతీ ॥మన॥
వికాసితరూపభావోజ్వలము

గాంచలేము మనము పవనచలనమున
జ్యోతి నేటికి మలిగిపోయెనా.
మనకగుపడదా ॥మన॥

తో॥ గాంధీ తరములో జన్మించిన జన్మయు జన్మా
కల్హారగ దర్శించగజాలిన కన్నులె కన్నుల్

వ. ముందుతరాలవారికి ఈయనను దర్శించుభాగ్య మెక్కడిది. అయినప్పటికి, అనశ్వరమైన మహాత్ముని సందేశము భావితరములవారి హృదయములమందానంద మొందు శక్తిసంపదం జేకూర్చం గలదు యుండియూ చిరుతస్వాతంత్ర్యములో రక్తపాతము మత విద్వేషములో మునిగిపోయినది మనచే యొనరింపబడిన ఈ ఘాతుక కృత్యము యిండియాకు వజ్రఘాతము ఈ కళంకము తఱతరాలకైనా యుగయుగాలకైనా మనలను వీడదు సరస్వతి ఘట్టములో వైచిన అస్థికలు మహాత్మునివి కావు మానవ గౌరవ శిఖరశిధిలాలు మఱి నేనో

సీ॥ ముసిముసి నగవుల ముత్యాలరాశిని
ఒలకించినట్టి చంచలుండనైతి
మానవకల్యాణ మాణిక్యమున్ దెచ్చి
చితిపైనం జేర్చిన చెడుగునైతి
సత్యడోలికలోని సద్గుణఖనిదెచ్చి
యలహాబాదున నుంచుఖలుండనైతి
భరతాంబ పెంచిన భాగ్యరాశినిదీసి
గంగలోం గలిపిన దొంగనైతి

గీ॥ యమునలోఁ బోయు బూడిద యెవరిదనుచు
భస్మమై పోయినట్టి ఈ భరతదేశ
యప్రతిష్టల బూడిదయనుచు నేను
కుమిలి వాపోసి వాపోసి కృంగవలసె

వ. కావున వర్గవిద్వేష విషలిప్తమైన హింసాచర్యల
నుండి యువకులు విముక్తిఁ జెంది రాజకీయప్రతీకక్షులుగాక
తమ మార్గమును దిద్దుకొందురని నా ఆశయము శాంతియుత
ముగాయున్న ప్రతిపౌరుఁడు హక్కుబడయగలఁడు గతములోఁ ద
నిట్టిశక్తి మనకులేదు కాని ఈ గంగాతీరములో చేరినవారిలో
మతవిద్వేషాన్ని బాపగలమని కంకణము ధరింపనివారెవ్వ
రుందురు ఆయన విడిచినపనిని పూర్తిగావించి ఆయనగన్న
కలలను యిండియాపై స్థాపించడమే మనధర్మము లేనిచో
గాంధీనాయకత్వానికి మన మనస్సులను పరులమేలు మన
మేలుగా భావించడము మనకు సాధ్యముకాకపోవచ్చునుకా
పరులకీడుద్వారా మన మేలును సాధించడమైనా మన
నేర్చుకోవాలి రెండవ చంపద్రిప్పటము మనకు సాధ్యంకా
పోవచ్చును కాని చంపపెట్టుఁ బెట్టడమే మనవంతుకాకుం?
చూచుకోవాలి సర్వత్యాగముఁ జేయడము మనకుసాధ
కాకపోవచ్చునుకాని, సంఘానికి ద్రోహంచేసే, దేశా
ముప్పుతెచ్చే స్వార్థపటుత్వమునం మానుకొవాలిగాంధిజీకి పీ
వేయవలసినది దేవలోకములోకాదు, మన హృదయ పీఠ
లోనే అనిచెప్పినంత ముప్పదిలక్షల ప్రజానీకము యొకమ
కేలుమోడ్చి

గీ। జహర్లాల్ ప్రజసేవను జీవితంబు
ధారఁబోసి, యహింస సూత్రంబులల్లి
జోలపాడుము టాగూరుయ్యెలలుగట్టి
కర్మచంద్రుఁడు కీర్తినిఁగాంచునట్లు
కృతి ఆదితాళము (మనసా శ్రీరామ)

బాపూ. జయమంగళంబని ప్రార్థితుముమము బ్రోవన్ ॥ఓ॥ బా॥
భరతాంబ కొంగు బంగారమనగ చిరునవ్వు మోముతోఁ
మమ్ము చూచుకో ॥ఓ॥ బా॥

శ్వేతజాతి దాస్యము త్రెంచేసి, విశేషకీర్తి
గడించిన జ్యోతివి, స్వేచ్ఛాలంపాల్గొన, హరి
జనులకునై, సేవజేసితివి, త్యాగమూర్తివనగ ॥ఓ॥ బా॥

సంపూర్ణం.

---

రామా ఆర్టు ప్రెస్, విజయవాడ.